# బైబిల్‌లో యేసు జీవితంలో, ఏది నిజం, ఏది అబ్బదం?

**1) యేసు ఏ వంశంలో పుట్టాడు?**

ఎ) యేసు దావీదు కుమారుడు సొలోమును, వంశంలో పుట్టాడు-మత్తయి సువార్త (1:6,7)

బి) యేసు దావీదు కుమారుడైనటువంటి, నాతాను వంశలో పుట్టాడు. లూకాసువార్త (3:31,32)

**2) యోసేపు తండ్రి (యేసు తాత) ఎవరు?**

ఎ) యోసేపు తండ్రి హేలీ.... లూకా సువార్త (3:31) బి) యోసేపు తండ్రి యాకోబు ... మత్తయి సువార్త (1:16)

**3) యేసు, అబ్రహాము తర్వాత ఎన్నో తరంలో పుట్టాడు?**

ఎ) యేసు, అబ్రహాము మొదలుకొని 41వ తరంలో పుట్టాడు. మత్తయి సువార్త( 1:2టు16)

బి) యేసు, అబ్రహాము మొదలుకొని 56వ తరంలో పుట్టాడు. లూకా సువార్త (3:23టు34)

**4) యేసు పుట్టిన విధానం ఏది?**

ఎ) యోసేపు తనభార్య అయినటువంటి, మరియతో బెత్లేహేములో ఉండగా ఏసుపుట్టాడు. మత్తయి సువార్త(1:19టు25)

బి) యోసేపు బనాభా లెక్కలప్పుడు, గలిలయలోని, నజరేతు నుండి యూదయలోని, బేత్లెహేమునకు, వచ్చినప్పుడు ఏసు పుట్టాడు. లూకా సువార్త (2:1టు7)

**5) హేరోదు అనే రాజు ఏమయ్యాడు?**

ఎ) హేరోదు యేసు చిన్నప్పుడే చనిపోయాడు. మత్తయి సువార్త (2:19)

బి) హేరోదు యేసు పెద్ద అయినా, కూడా ఉన్నాడు. మార్కు సువార్త (16:6). లూకా సువార్త(13:31) (23:8) మత్తయి సువార్త (14:1టు11) హేరోదు అనే వారు ఇద్దరు ఉంటే బైబిల్‌లో ప్రూఫ్ యెక్కడ ఉంది.

**6) బాప్తిసం ఇచ్చే యోహానుకు, యేసు గురించి తెలుసా? తెలియదా?**

ఎ) యోహానుకు, యేసు దేవుని కుమారుడని తెలుసు. మత్తయి సువార్త (3:13టు16).

బి) యోహానుకు, యేసు దేవుని కుమారుడని తెలియదు. యోహాను సువార్త (1:31టు33).

**7) యేసు బాప్తిసం తీసుకున్నాకా ఏం జరిగింది?**

ఎ) యేసు బాప్తిసం తీసుకున్నాక సైతాను 40రోజులు, యేసుని అడవుల్లోకి తీసుకువెళ్ళి ఉంచింది. మత్తయి సువార్త (4:1,2) మార్కు సువార్త (1:12,13) లూకా సువార్త (4:1,2).

బి) యేసు బాప్తిసం తీసుకున్న, 3వ రోజు కానా, అను ఊరిలో పెళ్ళి విందుకు వచ్చాడు. యోహాను సువార్త(2:1,2).

**8) సైతాను భూలోక రాజ్యాలు, మొత్తాన్ని యేసుకు, ఏవిధంగా చూయించింది?**

ఎ) మిక్కిలి ఎతైన కొండమీదికి తీసుకెళ్లి, భూలోక రాజ్యాన్ని మొత్తాన్ని యేసుకు చూపించింది. మత్తయి సువార్త(4:8).

బి) సైతాను యేసు ప్రభుని ఒక నిమిషంలో, భూలోక రాజ్యాన్ని మొత్తాన్ని తిప్పిచూచించింది. లూకా సువార్త (4:5).

**9) యేసు సీమోనును, ఆంద్రేయను, ఎక్కడ ఉండగా మొదట చూశాడు?**

ఎ) యేసు గలిలయ, సముద్ర తీరమున ఉన్నప్పుడు సీమోనును, ఆంద్రేయను పిలిచాడు (చూశాడు). మత్తయిసువార్త (4:18) మార్కుసువార్త (1:16).

బి) గన్నేసరెతుసరస్సు తీరమున, ఉన్నప్పుడు యేసు చూశాడు. వారుయేసును అనుసరించారు. లూకాసువార్త(5:1టు11)

**10) సీమోను పేతురు, మరియు ఆంద్రేయ ఎలా యేసు శిష్యులయ్యారు?**

ఎ) యోహాను అదిగో అతను దేవుని యొక్క కుమారుడు అని చెప్పే యోహాను శిష్యులు అయినటువంటి సీమోను పేతురు మరియు ఆంద్రేయ వచ్చి యేసు శిష్యులయ్యారు. యోహాను సువార్త(1:35టు41).

బి) యేసు గలిలయ సముద్ర తీరంలో వెళ్ళుచుండగా సీమోనును, ఆంద్రేయను పిలవగా వాళ్ళు వల్లి యేసుకు శిష్యులు అయ్యారు. మత్తయి సువార్త(4:17టు19) మార్కుసువార్త (1:16టు18).

సి) యేసు చూపిన మహత్యానికి, ఆశ్చర్యపడి, యేసు పిలవగానే శిష్యులయ్యారు. లూకాసువార్త (5:4టు11)

**11) పక్షవాయువుతో ఉన్నవాడిని యేసు వద్దకు ఎలా తీసుకువచ్చారు?**

ఎ) జనము పక్షవాయువుతో ఉన్నవాడిని, సాధారణంగానే, యేసు వద్దకు తీసుకువచ్చారు. మత్తయి సువార్త(9:1టు6).

బి) కొందరు పక్షవాయువు వచ్చిన వాడిని, ఇంటి పైకప్పు విప్పి, సందు చేసి పరుపు మీద వుంచి ఇంట్లో దించారు. మార్కుసువార్త (2:3టు12).

సి) కొందరు పక్షవాయువు వచ్చిన వాడిని, తీసుకువచ్చి ఇంటిపై పెంకులు విప్పి, మంచముతో యేసు వద్ద దింపారు. లూకా సువార్త (5:17టు25) పక్షవాయువు వాని గురించి యోహాను సువార్తలో ఎక్కడ ఉండదు.

**12) యేసు యేరుషలేమునకు ఎలా వచ్చాడు?**

ఎ) యేసు గాడిదను, గాడిద పిల్లను, ఎక్కి వచ్చాడు. మత్తయి సువార్త(21:7).

బి) యేసు గాడిద పిల్లను మాత్రమే ఎక్కి వచ్చాడు. మార్కుసువార్త(11:7). లూకా సువార్త(19:35).

**13) యేసు శిష్యులు గాడిద పిల్లను తీసుకువస్తుంటే, ప్రశ్నించిన వారు ఎవరు?**

ఎ) ఎవరు ప్రశ్నించలేదు. మత్తయిసువార్త(21:1టు7).

బి) గాడిద పిల్లని విప్పుతుంటే, అక్కడ ఉన్న కొందరు ప్రశ్నించారు. మార్కుసువార్త(11:5)

సి) గాడిద పిల్ల యాజమానులు ప్రశ్నించారు. లూకాసువార్త(19:33).

**14) యేసు అంజూరపు చెట్టును ఏమని శపించాడు?**

ఎ) యేసు అంజూరపు చెట్టును చూచి, ఇకమీదట ఎన్నటికిని నీవు కాపు కాయకుందువుగాక అని శపించెను. మత్తయిసువార్త(21:19).

బి) యేసు ఇకమీదట ఎన్నటికిని, నీ పండ్లు ఎవరును తినకుందురు గాక అని శపించాడు. మార్కు సువార్త(11:14).

**15) మగ్ధలేని మరియ అత్తరును ఏమి చేసింది?**

ఎ) అత్తరును యేసు తల మీద పోసింది. మత్తయి సువార్త(26:7) మార్కుసువార్త(14:3).

బి) అత్తరును యేసు యొక్క పాదాలకు రాసింది. లూకాసువార్త(7:37,38) యోహానుసువార్త (12:3).

**16) యేసు పాదాలను అత్తరురాసి తలవెంట్రుకలతో తుడిసిందా? లేక తలతో వెంట్రుకల యేసు పాదాలను తుడిచి అత్తరు రాసిందా?**

ఎ) తల వెంట్రుకలతో, యేసు యొక్క పాదాలను తుడిచి, ఆ తరువాత ఆయన పాదాలకు అత్తరు రాసింది. లూకాసువార్త(7:38).

బి) యేసు యొక్క పాదాలకు అత్తరు రాసి, తల వెంట్రుకలతో ఆయన పాదాలు తుడిచింది. యోహానుసువార్త(12:3).

**17) యేసుకు అత్తరు రాసే బదులు, అమ్మి పేదలకు ఇస్తే బాగుండు అన్నది ఎవరు?**

ఎ) యేసు శిష్యులు అన్నారు. మత్తయి సువార్త (26:8,9).

బి) అక్కడ ఉన్న కొందరు అనుకున్నారు. మార్కు సువార్త(14:4,5).

సి) యేసు శిష్యుడైన ఇస్కరియోతు యూదా మాత్రమే అన్నాడు. యోహాను సువార్త (12:4టు6).

**18) యేసు సూచక క్రియ చేశాడా?**

ఎ) యేసును సూచక క్రియ చేయమన్నప్పుడు, యేసు ఈ తరం వారికి సూచక క్రియ అనుగ్రహింపబడదని చెప్పాడు. మత్తయి సువార్త (12:37టు39) (16:1,4). మార్కు సువార్త(8:11,12). లూకా సువార్త (11:16,29).

బి) యేసు అనేక సూచక క్రియలు చేశాడు, చూపించాడు. యోహాను సువార్త(2:11,18,19,23), (3:1,2), (4:48,49,53,54), (6:2,14), (7:31), (12:17,18, 37), (20:30).

**19) యేసును చూచి భయపడిన దెయ్యము పట్టిన మనుష్యులు ఎంత మంది?**

ఎ) యేసును చూసి దెయ్యము పట్టిన ఇద్దరు మనుష్యులు భయపడి యేసుని వేడుకున్నట్టుంది. మత్తయి సువార్త(8:28).

బి) యేసును చూసి దెయ్యాలు పట్టినవాడు ఒక్కడు, భయపడి యేసుని వేడుకున్నట్టుంది .మార్కు సువార్త(5:2) లూకా సువార్త (8:27).

**20) యేసు ఎంతమంది గుడ్డి వారికి కళ్ళు తెప్పించాడు?**

ఎ) యేసు ఇద్దరు గుడ్డి వారికి కళ్ళు తెప్పించాడు. మత్తయి సువార్త(20:29,30).

బి) యేసు ఒక గుడ్డివాడికి కళ్ళు తెప్పించాడు. మార్కు సువార్త (10:46టు52) లూకా సువార్త(18:35).

**21) యేసు పేతురు తోటి నీవు నన్ను ఎరగవు ఎన్నిసార్లు చెప్తావని చెప్పాడు? కోడి కూయక మునుపే చెప్తాడా! రెండుసార్లు కూసేలోపు చెప్తావు అన్నాడా?**

ఎ) కోడి ఒకసారి కూసేలోపే, మూడుసార్లు నీవు నన్ను ఎరుగవని చెప్తావు, అని యేసు చెప్పాడు. మత్తయి సువార్త(26:34) లూకా సువార్త(22:34) యోహాను సువార్త(13:38).

బి) కోడి రెండుసార్లు కూసేలోపు, నువ్వు నన్ను తెలియదని మూడుసార్లు చెప్తావు, అని యేసు చెప్పాడు. మార్కుసువార్త(14:30).

**22) యేసు నిద్రపోతున్న శిష్యుల దగ్గరకు ఎన్ని సార్లు వచ్చాడు?**

ఎ) యేసు తన శిష్యుల వద్దకు మూడుసార్లు వచ్చాడు. మత్తయి సువార్త(26:39టు46) మార్కు సువార్త(14:36టు41).

బి) యేసు తన శిష్యుల వద్దకు ఒక్కసారి మాత్రమే వచ్చాడు. లూకా సువార్త(22:40టు48). అసలు ఈ విషయం అనేది యోహాను సువార్తలో ఉండదు.

**23) యేసుని పట్టించడానికి వచ్చినప్పుడు, యూదా ఏం చేశాడు?**

ఎ) యూదా వచ్చి యేసుకు ముద్దు పెట్టుకున్నాడు. మత్తయి సువార్త(26:49) మార్కు సువార్త(14:45).

బి) యూదా యేసును ముద్దు పెట్టుకోలేదు. లూకా సువార్త(22:49).

సి) ఇక్కడ యూదా యేసు వద్దకువచ్చి రావడంగానీ, మాట్లాడడంగానీ, ఏమీ జరగలేదు అని యోహాను సువార్త18వ అధ్యాయం.

**24) యేసుని బంధించినప్పుడు యేసు శిష్యులు ఏమయ్యారు?**

ఎ) యేసుని బంధించగానే ఆయన శిష్యులు పారిపోయారు. మత్తయి సువార్త(26:56). మార్కుసువార్త(14:50టు52).

బి) యేసు తనను బంధించే ముందే తాను శిష్యులను పోనిమ్మని, అక్కడ వారికి చెప్పాడు. ఆ విధంగా ఆ శిష్యులు వెళ్ళారు. యోహాను సువార్త(18:8).

**25) యేసును బంధించి తీసుకెళ్లేటప్పుడు యేసును అనుసరించింది ఎంతమంది శిష్యులు?**

ఎ) యేసును బంధించి తీసుకెళ్ళేటప్పుడు, యేసును అనుసరించింది పేతురు ఒక్కడే. మత్తయి సువార్త(26:58), మార్కు సువార్త(14:54), లూకా సువార్త(22:55).

బి) యేసుని బంధించి తీసుకెళ్ళేటప్పుడు, యేసును అనుసరించింది ఇద్దరు శిష్యులు. యోహాను సువార్త(18:15).

**26) పేతురు, యేసుని పట్టుకొని కొట్టడము గుద్దటము యేసు ముఖం మీద, ఉమ్మి వేయటం వంటి దృశ్యాలను చూశాడా? చూడలేదా?**

ఎ) యేసును కొట్టడం గుద్దడం, ముఖం మీద ఉమ్మి వేయడం వంటి దృశ్యాలు పేతురు చూశాడు. మత్తయి సువార్త(26:57టు69) మార్కు సువార్త(14:57టు69) యోహాను సువార్త(18:12టు25).

బి) యేసుని కొట్టడం గానీ, గుద్దడం గానీ, ఆయన ముఖం మీద ఉమ్మి వేయడం వంటి దృశ్యాలను పేతురు చూడలేదు. లూకా సువార్త(22:55టు62).

**27) పేతురుని మూడు సార్లు యేసు గురించి ప్రశ్నించిన వారు ఎవరు?**

ఎ) మత్తయి సువార్త(26:69టు73) ప్రకారం, ఇద్దరు వేరు వేరు స్త్రీలు తర్వాత కొంత మంది వ్యక్తులు పేతురును ప్రశ్నించినట్లు ఉంటది.

బి) మార్కుసువార్త(14:66టు70)ప్రకారం,ఒకే స్త్రీ రెండుసార్లు పేతురును ప్రశ్నించినట్టు,తర్వాతఅక్కడఉన్నకొంతమందిప్రశ్నించినట్టు ఉంది.

సి) లూకాసువార్త(22:56టు60)ప్రకారం,మొదట ఒకస్త్రీ తర్వాతఇద్దరు వేరువేరు పురుషులు,పేతురును ప్రశ్నించినట్లు ఉంది.

**28) యేసు మీద అబద్ధం సాక్ష్యం చెప్పినవారు ఎంతమంది?**

ఎ) కొందరు మనుషులు, దేవాలయాన్ని పడగొట్టి మూడు దినాలలో కడతానని, చెప్పాడని, అబద్ధం సాక్ష్యం చెప్పారు. మార్కు సువార్త(14:57,58).

బి) ఇద్దరు మనుషులు వచ్చి దేవాలయం పడగొట్టి మూడు దినాలలో కడతానని చెప్పాడు అని, అబద్ధ సాక్ష్యం చెప్పారు. మత్తయి సువార్త(26:61,62).

సి) ఎవరు అబద్ధ సాక్ష్యం చెప్పలేదు. యేసు నిజంగానే దేవాలయం పడగొట్టి, మూడు దినాలలో కడతానని చెప్పాడు. యోహాను సువార్త(2:19).

**29) యేసును బంధించినాక విచారణ చేసిన వారు ఎంతమంది?**

ఎ) యేసును ప్రధాన యాజకుడు, మరియు పిలాతు మాత్రమే విచారణ చేశారు. మత్తయి సువార్త(26:62), (27:2) మార్కుసువార్త(14:60, 14:1).

బి) యేసును ఒక ప్రధాన యాజకుడు రెండు పిలాతు మరియు మూడు హేరోదు, ముగ్గురు వ్యక్తులు యేసును విచారణ చేసినట్లు ఉంది. లూకా సువార్త(22:66, 23:1, 23:6టు11).

సి) యోహాను సువార్త ప్రకారం, కయప యొక్క మామ అన్నయు, తరువాత కయప, చివరగా పిలాతు, యేసుని విచారించినట్లు ఉంది. యోహాను సువార్త(18:12,24,29).

**30) యేసును పట్టించిన యూదా ఎలా చనిపోయాడు?**

ఎ) యూదా ఉరి వేసుకొని చనిపోయాడు. మత్తయి సువార్త(27:5).

బి) తలకిందులుగా పడి నడిమి బద్దలై ప్రేగులు బయటకు వచ్చి చనిపోయాడు. అపోస్తలుల కార్యములు (1:18).

**31) యేసుకు శిక్ష వేసేటప్పుడు పిలాతు పరిస్థితి ఏమిటి?**

ఎ) పిలాతు యేసు నీతిమంతుడని, శిక్షించకుండా విడుదల చేయాలని ప్రయత్నించాడు. ప్రజల గొడవ వలన శిక్ష విధించాడు. మత్తయి సువార్త(27:19టు24). లూకా సువార్త(23:4టు22). యోహాను సువార్త(19:6టు16).

బి) పిలాతు, జనాన్ని సంతోష పెట్టడం కొరకు యేసుకు సిలువ శిక్ష వేశాడు. మార్కు సువార్త(15:15).

**32) సైనికులు యేసుకు ఏ రంగు వస్త్రాన్ని తొడిగారు?**

ఎ) మత్తయి సువార్త(27:28) ప్రకారం ఎర్ర రంగు వస్త్రము, ఆయనకు తొడిగించినారు.

బి) మార్కు సువార్త(15:17) యోహాను సువార్త(19:3) ప్రకారం ఊదారంగు వస్త్రము, ఆయనకు తొడిగించారు.

**33) యేసుకు సిలువ వేసినప్పుడు బోర్డు మీద ఏమని రాశారు?**

ఎ) మత్తయి సువార్త(27:37) ప్రకారం "ఇతడు యూదుల రాజైన యేసు".

బి) మార్కు సువార్త(15:26) ప్రకారం "యూదులరాజైన యేసు" (సి) లూకా సువార్త(23:38).ప్రకారం "యూదుల రాజు".

డి) యోహాను సువార్త(19:19) ప్రకారం "యూదుల రాజైన నజరేయుడగు యేసు".

**34) యేసుతో పాటు సిలువ వేయబడ్డ ఇద్దరు ఏం చేశారు?**

ఎ) ఆయనతోపాటు సిలువ వేయబడిన వారు, యేసును నిందించారు. మత్తయి సువార్త(27:44).

బి) యేసుతో పాటు సిలువ వేయబడ్డవారు. యేసు సిలువ మీద నుండి దిగితే, నమ్ముతాము అన్నారు. మార్కు సువార్త(15:32).

సి) సిలువ మీద ఉన్న నిందితుల్లో ఒకడు యేసును దూషించుచూ, నిన్ను నీవు రక్షించుకొనుము, మమ్మల్ని కూడా రక్షించుమని అన్నాడు. లూకా సువార్త(23:39).

**35) యేసును సిలువ మీద నుంచి క్రిందకు దిగి రక్షించుకో అన్నది ఎవరు?**

ఎ) మార్గమున వెళ్లుతుండేవారు, శాస్త్రులు, ప్రధానయాజకులు, సిలువ వేయబడిన నిందితులు, మత్తయి సువార్త(27:39టు44) మార్కు సువార్త(15:29టు33).

బి) అధికారులు, సైనికులు, ఆయనతో పాటు ఉన్న నిందితుల్లో ఒకడు లూకా సువార్త(23:35టు39). ఈ సందర్భం యోహాను సువార్తలో ఈ ప్రస్తావన లేదు.

**36) యేసు సిలువ మీద పలికిన చిట్టచివరి మాట ఏది?**

ఎ) యేసు ఏలీ, ఏలీ,లామా సబక్తానీ అని బిగ్గరగా కేక వేసెను. ప్రాణము విడిచెను. మత్తయి సువార్త(27:46టు50).

బి) యేసు ఎలోయీ,ఎలోయీ, లామా సబక్తానీ అని బిగ్గరగా కేక వేసెను. ప్రాణం వడిచెను. మార్కు సువార్త(15o34టు36).

సి) తండ్రి నీ చేతికి నాఆత్మను అప్పగించుకొనుచున్నాననెను. ఆయన యీలాగు చెప్పి ప్రాణము విడిచెను. లూకాసువార్త(23:46).

డి) యేసు చిట్ట చివరగా దప్పిగొనుచున్నానని, సమాప్తమైనదన్నాడు. యోహాను సువార్త(19:29,30).

**37) యేసు ఎక్కడ మరణించాడు?**

ఎ) యేసు శిలువ పై మరణించాడు. మత్తయి సువార్త(27:50),మార్కు సువార్త(15o37),లూకాసువార్త(23:46),యోహాను సువార్త(19:30).

బి) యేసును మ్రానుకు వేలాడదీసి చంపారు. అపోస్తలుల కార్యములు(5:30) (10:39) (13:29) మొదటి పేతురు (2:24).

**38) యేసు సమాధి వద్దకు, స్త్రీలు ఏ సమయంలో వచ్చారు?**

ఎ) ఆదివారం రోజు తెల్లవారుతుండగా వచ్చారు. మత్తయి సువార్త(28:1) లూకా సువార్త(24:1).

బి) సూర్యోదయం అయినప్పుడు సమాధి వద్దకు వచ్చారు. మార్కు సువార్త(16:2).

సి) ఆదివారం ఇంకా చీకటిగా ఉన్నప్పుడే, వచ్చారు. యోహాను సువార్తవ(20:1) లూకా సువార్త(24:1).

**39) యేసు సమాధి వద్దకు, ఆదివారం రోజు వచ్చిన స్త్రీలు ఎంతమంది?**

ఎ) యేసు సమాధి వద్దకు , మగ్దలేని మరియ మరియు వేరొక మరియు వచ్చారు. మత్తయి సువార్త(28:1).

బి) మగ్ధలేని మరియ, మరొక మరియ, సలోమేయు వచ్చారు. మార్కు సువార్త(16:2).

సి) మగ్ధలేని మరియ, మరొక మరియ మరికొందరు స్త్రీలు. లూకా సువార్త(24:1,10).

డి) యేసు సమాధి వద్దకు కేవలం మగ్దలేని మరియ మాత్రమే వచ్చింది. యోహాను సువార్త(20:1)

**40) యేసు సమాధి వద్ద దేవదూతలు ఎక్కడ కనపడ్డారు?**

ఎ) ప్రభు, దూత ఒకటి వచ్చి రాయి దొర్లించి, రాయి మీద కూర్చుంది. మత్తయి సువార్త(28:2).

బి) సమాధి లోపల తెల్లని నిలువటంగి. ధరించుకున్న ఒకపరచువాడు కనపడ్డాడు. మార్కుసువార్త(16:5).

సి) సమాధి లోపల ప్రకాశవంతమైన, వస్త్రాలు ధరించిన ఇద్దరు మనుషులు కనపడ్డారు. లూకాసువార్త(24:4).

డి) తెల్లని వస్త్రములు ధరించిన ఇద్దరు దేవదూతలు మరియకు సమాధి లోపల కనిపించారు. యోహానుసువార్త(20:12).

**41) మగ్ధలేని మరియకు యేసు ఎక్కడ కనిపించాడు?**

ఎ) యేసు వారికి దారిలో కనిపించాడు.మత్తయి సువార్త(28:9).

బి) ఆదివారం ఉదయం అయిన తర్వాత కేవలం మగ్దలేని మరియకు (మాత్రమే) మొదట కనిపించాడు. మార్కు సువార్త(16:9).

సి) యేసు ఆమెకు సమాధి వద్ద, ఆమెకు, వెనక నిలిచి ఉన్నాడు. యోహాను సువార్త(20:14) లూకా సువార్తలో అసలు యేసు మరియకు ఎప్పుడు కనపడలేదు.

**42) యేసు సమాధి వద్దకు వచ్చిన స్త్రీలకు, యేసు పాదాలను ముట్టుకున్నారా లేదా?**

ఎ) యేసు పాదాలను ముట్టుకున్నారు. మత్తయి సువార్త(28:9).

బి) యేసును ముట్టుకొనలేదు. యోహాను సువార్త(20:17).

**43) యేసు తిరిగి లేచిన తర్వాత యేసు శిష్యులు సమాధి వద్దకు వచ్చారా? రాలేదా?**

ఎ) పేతురు, మరియు యేసు ప్రేమించిన మరొక శిష్యుడు, యేసు యొక్క సమాధి వద్దకు వచ్చారు. యోహాను సువార్త(20:3).

బి) పేతురు ఒక్కడు సమాధి వద్దకు వచ్చాడు.లూకా సువార్త(24:12) కొందరు శిష్యులు కూడావెళ్లారని, లూకా సువార్త(24:24)లో వుంది.

సి) యేసు సమాధి వద్దకు ఏ శిష్యులు పోలేదు. మత్తయి సువార్త(28).

డి) యేసు అసలు బతికాడంటే శిష్యులు నమ్మలేదు. మార్కు సువార్త(16:11).

**44) యేసు పునరుద్దానం తర్వాత శిష్యులను ఎక్కడ కలిశాడు?**

ఎ) శిష్యులు గలిలాయ కొండకు వెళ్లి అక్కడ యేసును కలిశారు. మత్తయి సువార్త(28:10,16,17).

బి) ఇద్దరు శిష్యులు పల్లెటూరికి వెళుతుంటే, వారికి ప్రత్యేక్షమయ్యాడు. మార్కు సువార్త(16o12,13). లూకా సువార్త(24:15).

సి) ఆయన శిష్యులు ఒక ఇంటిలో ఉండగా కనిపించాడు.యోహాను సువార్త(20:19).

**45) పునరుద్దానం తర్వాత యేసు తన శిష్యులుకు ఎన్నిసార్లు కనపడ్డాడు?**

ఎ) యేసు ఆయన శిష్యులకు ఒకసారి మాత్రమే కనపడ్డాడు. మత్తయి సువార్త(28:16,17).

బి) యేసు ఆయన శిష్యులకు రెండు సందర్భాల్లో కనపడ్డాడు. మార్కు సువార్త (16:12,14).

సి) యేసు శిష్యులకు మూడు సందర్భాల్లో కనపడ్డాడు. యోహాను సువార్త(20:19,26). (21:1).

**ఇంకా అనేక ప్రశ్నలు కలవు. అర్థం కాని యేసు జీవితం అనే మరొక పాంప్లేట్ కూడా అతి త్వరలో రిలీజ్ జరుగుతుంది.**

**ఎవరికన్నా డౌట్ ఉంటే సంప్రదించవచ్చు. ఎప్పుడైనా సంప్రదించవచ్చు.**

**దేశం కోసం, ధర్మంకోసం, దేశ విభజన సమయంలో ప్రాణాలర్పించిన వారి కుటుంబాలకు ఈ పాంప్లేట్ అంకితం**

ఇట్లు
హిందూ జాగ్రతిసేన
9963487494, 9948788979,
7569759525